REG. No. M. 2185

REG No N 45

The First Telugu Bi-weekly in Andra Desa, The only Telugu News Paper for H. E. H. The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును

హైదరాబాదు—దక్కన్

103163 GOLAKONDA PATRIKA HYDERABAD Dn

సంపుటము ౪ } ప్రమోదూతనామ సంవత్సర పుష్య శు॥ ౭ శనివారము 27—12—30 { సంచిక ౬౨

# గాంధీ మహాత్ముని తత్వము

## యుగ పురుషులలో మహాత్ముడొకడు

మహాత్ముడు సమస్త గుణవిరాజితుడు. ప్రపంచమునకు ఉపదేష్టగా నుండదగిన వాడు. విశాల భావము గలవాడు. గీతాశాస్త్రము మహాత్మునికి తోడునీడ.

మహాత్ముని ఆచారనీతి సత్యము మీదను అహింసా ధర్మము మీదను ఆధారపడియున్నది. యుద్ధములచే వేసారిన ప్రపంచమునకు మహాత్ముని అహింసా సిద్ధాంతము ఉపశమన మార్గమైనది.

ఢక్కాలో గతివారము జరిగిన అఖిల భారత తత్వజ్ఞాన మహాసభయొక్క ఆరవ సమావేశమునకు అధ్యక్షత వహించిన మైసూరు ప్రధాన విద్యాశాఖాధికారులగు ఇ. ఏ. వాడియా గారు గాంధీ మహాత్ముని జ్ఞాన నిపాగరిష్ఠతను గూర్చి యుపన్యసించిరి. వారి యుపన్యాసము నుండి దిగువ భాగములు ముద్రితములు:—

గాంధి మహాత్ముని తత్వమునుగూర్చి ముచ్చటించుట సులభమైన పనిగాదు ఏలనన వారు రాజనీతి విశారదులును ప్రపంచమునకు ఉపదేష్టయునై యున్నారు. ప్రపంచ చరిత్రయందు చెప్పుటను మహాత్ముని బోలిన ఉత్తమ జిజ్ఞాసువులెవ్వరును సాధారణ లౌకిక వ్యవహారములయందు పాల్గొనుట మన మెరుగము. కాని యిట్టిశక్తివంతులు రాజకీయములతో ఐక్యము కలిగించుకొనవలసిన యావశ్యకత కలిగినది ఏలనన రాజకీయ విషయముల ప్రాముఖ్యము చాల హెచ్చిపోయి నందువలన సామాన్యములగు నైతిక సిద్ధాంతము లకుగూడ నవి ఆక్రమములను గ్రమ వ్యాపించినది. కావున లౌకిక వ్యవహారములలో రాజకీయములకు గల ముఖ్యత్వమును వివరించుట కుపకరించు డొకడు అవసరమైనాడు. మనము మహాత్ముని యుపదేశములలో నిత్యమును పర్యాజన సమ్మతమును నగు సిద్ధాంతములనే గ్రహింపవలెను. ఐనను సమస్త సద్గుణ విరాజితుడగు మహాత్మునికిని, ప్రపంచమునకు ఉపదేష్టగా నుండదగిన మహాత్మునికిగల తారతమ్యమును గమనింపకుండుట వీలుకాదు.



మహాత్మాగాంధీ

### గాంధీజీ సుగుణములు

మొదటినుండియు విశాలభావము గాంధీమహాత్మునికి సైజముగా నుండెను కొన్నాళ్ళు క్రీస్తుమహాశయుని సిద్ధాంతములచే మహాత్ముడాకర్షింపబడెను కాని యెట్టకేలకు ఆయన హిందూమతమునందే యుండదలచెను కాని యీ హిందూమతమేది? పూర్వపు హిందూమతముకాదు తన జిజ్ఞాసా పరత్వముచే నూతవాక్యతను, మానవశక్తిని, నూతనోత్తేజమును గాంచిన హిందూమతము యోగశాస్త్రమగు గీతాశాస్త్రము మహాత్మునికి తోడునీడ. న్యూటెస్టుమెంటు అను క్రైస్తవ మత గ్రంథమందలి ప్రశస్తబోధలు మహాత్ముని వరములలో జతించినవి. అందుకే ఆయన „నామతము నకు హద్దులు లేవు" అని వచించెను. హిందూమతము ఒక చిన్న వాక్యములో వర్ణించుట బహుకష్టము. గొప్పవాడు జన్మచేత హిందువు డగునని చెప్పిరి. హిందువుడగువానికి జరిందియింకొక మతమునందు చేరకపోయిన వతడు హిందువగును. కావున మహాత్ముడుగూడ „హిందూమతమువిత పౌర్వస్య రహిత మార్గముల సత్యాన్వేషణము గావించుట" యని చెప్పుటలో ఆశ్చర్యమేమియు లేదు

మహాత్ముడు ఉపయోగించు మాటలు నిజముగా ప్రపంచమున కంతటికి వర్తించునవే యైనను ఒక్కకాలమునకు ఒక్క దేశమునకును సంబంధించినవైనట్లు తోచును. మాటెస్టెమెంటును టాల్‌స్టాయి, రస్కిన్ గారల వ్రాతలును, తన యభిప్రాయములకు మూలమని మహాత్ముడొప్పుకొనెను. దేశభక్తి యైనను ఒక దేశములోను, ఒకమతములోనుండ రాజాలదు. ఇట్టులే శరీరారోగ్యము విషయమై మహాత్ముడు డాక్టరు కూని, డాక్టరు జస్టుగారి వ్రాతల నంగీకరించెను. వేదములు మాత్రమే దేవవాక్యమని వారు చెప్పక బైబిలు, కొరాను కూడ దేవవాణియే యని వారు ఒప్పుకొనుచున్నారు. నిర్భయముగా కార్యరంగమునందు ప్రవేశించి పనిచేయుటవలన మహాత్ముడు ఆత్మ్యాస్త్రము కర్మయోగులలో నొక్కడైనాడు. భయమును బయిపవలసినదని యితరులకు బోధించుటయేగాక స్వవిషయమునందు భీతిని ఆయన పూర్తిగా త్యజించినాడు. మహాత్ముడు నిరాడంబరుడుగా నుండుటచే ప్రజాసామాన్యము వారి నిశ్శంకముగ అంతరాత్మలతో చేపట్టిన దైవభక్తియను పరిమళము మహాత్ముని దివ్యసన్నిధి గావించియున్నది. భగవంతుని యందు దృఢమయిన నమ్మకమును, ప్రభుత్వమునందు నమ్మకమును మహాత్మునికి సహజములు భగవంతునికి సహజమగు శమము శాంత మహాత్ముని ముఖకమలమునందు విరాజిల్లుచున్నవి

(3 వ పేజి చూడుడు)

# ఊహాప్రపంచము—హిందూ వితంతూద్వాహ శాసనము—రెండు మూతుల పాము— సహీఫా వైఖరి—అభినవ సవ్యసాచులు—లాభ ప్రదమగు ప్రకటన

ఏ యీ వారము హైకోర్టులో సోనాబాయి కేసులో తీర్పు చెప్పినారు సోనాబాయి ౧౮ ఏండ్ల కంటె పెద్దదన్ని వివేకతవు అగుటచేత స్వతంత్రు రాలనిన్ని ఇష్టము వచ్చిన స్లి పోవచ్చుననిన్ని తీర్పి యీ ఉయుండి అమీపవ సోనాబాయిని ఉంచుకున్న సాయెబు అమెను బుర్ఖాతో మోటారులో యెక్కించుకొన్నాను నూర్లకొద్ది తురకవాళ్లు ఉంచుకున్న సాయెబుచుట్టున్ను, కొత్త బూవమ్మ చుట్టున్ను చేరి అల్లాహో అక్బరు అని కేకలు వేసి ంపించిరి

* * * *

## హిందూ వితంతూద్వాహ శాసనము

పండిత కేశవరావుగారు "హిందూ వితంతువులెవ్వరైన పెండ్లి చేసుకుంటె వారు సంపాదించిన ఆస్తి వాండ్లకు పుట్టిన పిల్లలకు చెందవలసినది" అం యొక బిల్లు మన శాసనసభలో తెచ్చినారు దీని అస్సలు అభిప్రాయ మేమంటే పై సోనాబాయివలె తురకలలో చేరకుండా యెవరైనా హిందూవితంతువు ఒక హిందువునే పెండ్లాడినట్లయితే ఆమె పిల్లలకు ఆమెయాస్తి చెందవలెనని ఇదుపై పంజాబు నుండి ఒక మధ్వాచార్లు యుద్ధానికి వచ్చినారు ఆయన యింతో విరిచివిరిచి నోరు చించుకొని ఉక్కిరి బిక్కిరియై నాట్య మాడుతూ ఉపన్యాసాలిస్తున్నారు "కుయ్యో మొరో గడ వాళ్ళు పెండ్లి చేసుకుంటే వ్యభిచారము చేసిన వాళ్లవుతారే! మా పవిత్ర హిందూరక్తములో కల్తి రక్తము కలుస్తుందే! ఇంకెట్లా'" అంటూన్నాడాయన పాపము వీరి గోత్ర పురుషు లెంత వరకు స్వక్రమముగా పుట్టినారో వీరికి ఊహారాలేదు ఒకఋషి చాకలిదానికి, ఒకాయన జోరుదానికి, కొందరు జంతువులకు, కొందరు కుండలలో యీలాగా పుట్టినారు వారిదెట్లయిన పవిత్రమైన రక్తమే! వచ్చిన అవస్తంతా వితంతువులకే వితంతువులు తురకలై పోయినా చింతలేదు కాని హిందువులు గానుండి యీ చెప్పరాని పని—పెండ్లిచేసుకోవటము— చేస్తే యెట్లా? ఒకవేళ రహస్యముగా వ్యభిచరించినకొడ్ల మూసుకొని పోవచ్చును దిగ్రాపినా యెవరితో చెప్పకుండా వుండవచ్చును కాని ఇదేమి అత్యాచారము— పెండ్లిఅట— మళ్లీ ముత్తైద లగుతారట! ఇక అస్సలు ముత్తైదల గతియెట్లా?

* * * *

## రెండు మూతుల పాము

ఇట్లా పండితులు, శాస్త్రుర్లు, వేదాలు గీదాలు అన్ని తలకిందలుచేసి శాస్త్రార్థాలు చేస్తుంటే వీరికి ఆసరాగా దేశభక్త ధర్మవీర వామన నాయకు మహాశయగారు రాత్రింబగళ్లు శ్రమచేస్తున్నారు నాయకునిం గారు రెండు మూతులు వ్రాను పాము వలెనున్నారు జోగిపేట మహాసభలో వితంతు వివాహ చట్టము చేయవలసినదని గర్జించి గర్జించి ప్లాటుఫారము పలకలు పగల దుముకి అయ్యో పాపము అని సదాశివపేట వాళ్ళకూడ అనుకునే అట్లు అంతరిని యేడ్చేలాగాచేసి ఉపన్యాసం కొట్టినారు. అయితే మొన్న శాసనసభకు మధ్వాచార్యులపై కమిచ్చి వీరుపిలిపించి ఉపన్యాసము ఇప్పించి ర అంగారు అదినిజమో అబద్ధమో కాని రామచంద్ర నాయకుగారు "బయట ఆచార్లకు హైద్రాబాదు చర్చలో ఏమిదఖల్" అంటే "కాము కూడదు బరాబరు — రు మాట్లాడవలసిందే" అ వామన నాయకుగారు వాదించినారు అంతేకాదు వారుకూడ కొన్ని దినాలు కూర్చోని లెక్కల పట్టిలు తయారుచేసి యేమేమో ఉపన్యాసం చెప్పారు మొత్తము మీదా ౩౦ యేండ్లలోపలి వితంతువులు పెండ్లి చేసుకుంటే వారి సహాయము చేస్తారట కాని అది శాసనము కాకూడదట ఇట్లా గోడమీది పిల్లివలె మాట్లాడినారు హిందూశాస్త్రాలల్లో సర్కారు వారు జోక్యము పుచ్చుకోకూడదట! ఇంత వరకయిన హిందూనంత శాస్త్రాలకు విరుద్ధమే! దాని కేమి చేసినారు వీరు

* * * *

## సహీఫా వైఖరి

అన్నిటికన్న విచిత్రం సహీఫా పత్రిక వైఖరి సహీఫా పత్రికకు అకస్మాత్తుగా వేదములపై యెక్కడలేని అభిమానము కలిగింది "వేదాలంతమంట్లోకలిసి పోతున్నాయి భద్రంగా రక్షించుకోండి" అని మా అయ్యవార్లకు బోధించినారు వారుశాస్త్రార్థము చేసేదానికి రైలు ఖర్చులు భరిస్తామన్నారు, ఆఖరు శాసన సభకు శాసనము విరుద్ధముగా వోటు యిచ్చేవారిని తమ వారు బండ్లల్లో మోసుకొని పోతామని నోటీసు ఇచ్చినారు శాసన సభలోకూడ శాస్త్రుర్ల మధ్యన గడ్డం దువ్వుకుంటూ కూర్చున్నారు గడ్డాలకు జుట్లకు యెంత దగ్గరి బాంధవ్యము కుదిరిందో చూడండి ఇన్నినే సోనాబాయి బూవమ్మ కాలేదా? సహీఫాకు యీ సంగతి బాగా తెలుసును కదా!

* * * *

## అభినవ సవ్యసాచులు

ఆరు నెల్లు సాముచేసి మూలనుండే ముసల్దాని తన్నినట్లు వామన నాయకువంటి నూతన బ్రాహ్మణులున్ను, దండిస్వామివంటి సన్యాస బ్రువులున్ను, మధ్వాచార్లవంటి ఆచార్య నామకులును, పెద్ద పెద్ద శాస్త్రులమనే పూర్వాచారులున్ను అనాధమైన వితంతువుపై యుద్ధము చేయుటకై నడుము బిగించుకొని అభినవ సవ్యసాచులై తుదకు సహీఫా సంపాదకుని వంటి ముసల్మానులకు వితంతువులనప్పగించ యత్నించు చున్నారు

* * * *

## లాభ ప్రదమగు ప్రకటన

గుండ్రనిబల్ల సమావేశములో పాల్గొనుటకు గాను బ్రిటిషు ఇండియా ప్రతినిధులతోపాటు స్వదేశసంస్థానముల ప్రతినిధులుకూడ లండను నగరమునకు వెళ్లి యుండిరి కదా! వీరు సంస్థానముల కట్టిహక్కులు ప్రసాదించ వలయునో, భారత ప్రభుత్వముతో తమకెట్టిసంబంధము దేవలయునో, తమ తమ గౌరవములకు తగినటుగ సూచించిరి ముఖ్యముగ మననిజాం రాష్ట్ర ప్రతినిధులగు నవాబు సర్ హైదరు నవాజుజంగ్ బహదురు ఈ సంస్థానముయొక్క ఖ్యాతిని యినుమడింప జేసిరి ప్రస్తుత పరిపాలకుల కాలములో నిజాంరాష్ట్ర మెట్లు అభివృద్ధి జెందెనో విశదీకరించిరి అన్నిటికన్న మన నవాబుగారి వలన ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు గొప్పపేరు వచ్చినది రౌండుటేబిల్ సభ వలన ఇచటి ప్రజలకేకాని, పరిపాలకులకేకాని, నూతన హక్కులు లభించినను, లభించకున్నను, నిజాంరాష్ట్రాభివృద్ధి ప్రపంచ మునకు వెల్లడియయ్యెను అందుచే ఈసభ పత్రికలలోని ప్రకటనవలె లాభ ప్రదమయ్యెనని చెప్పిన తప్పు కానేరదు కొందఱ సభవలన నేమిలాభము కలుగకున్నను ప్రతినిధులు లండను యాత్రి మాత్రము చేసికని వారొను చున్నారు ఇది పొరపాటు ఇది బ్రిటిష్ ఇండియా ప్రతినిధులకు వర్తించునేమో కాని స్వదేశ సంస్థానముల ప్రతినిధుల గూర్చి—ముఖ్యముగ మనరాష్ట్ర ప్రతినిధుల గూర్చి —పై విధముగ అభిప్రాయ పడిన తప్పే యగు ను ఏలయన తమ తమ రాష్ట్రముల అభివృద్ధి గూర్చి ప్రపంచములో వ్యాపారమున కొకముఖ్య కేంద్రమున, సూర్యు డస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యములో మొదటి నగరమున, అగు లండను నగరమున ప్రకటన గావించకున్న ఇతర స్థలములలో జేసిన లాభముండునా?

---

